# రుద్రవీణ

అభ్యుదయ కవి చక్రవర్తి
కవిసింహ, మహాకవి,
దాశరధి కృష్ణమాచార్యులు
"దాశరధి"

ప్రకాశకులు.
శ్రీ రామా అండ్ కో
తెనాలి.

# సూచిక

# సవరణ

౧ వ పేజీ ౪ వ పద్యం 3 వ పాదంమానసహృదయమందున అను చోట మానసహ్రదమునందున

౨ వ పేజీ ౭ వ పద్యం చివరిపాదం వ్యవదేశవాతములు అనుచోట వ్యపదేశవాతములు.

3 వ పేజీ ౫ వ పంక్తి ఇవి వర్షానికి గొడుగులు అనుచోట ఇవి సర్గానికి సురుగులు.

# ప్రకాశిక

కోటి తెలంగాణ ప్రజల ఏకైక మహాకంఠవీణాధ్వని వినాలంటే దాశరధి కావ్యగానం వినాలి

నా తెలంగాణ, కోటిరత్నాల వీణ

అని కంఠమెత్తి దాశరధి పాడుతున్నప్పుడు తెలంగాణ మహాప్రజ సముద్రజలాల మాదిరి కరుల్లెత్తి పొంగి వస్తుంది.

దాశరధి గీతాలు వినని రసికులు తెలంగాణమందుండరు.

దాశరధిని ప్రేమించని సాహిత్యకులు తెలంగాణలో లేరు.

దాశరధి చే స్వీకరింపబడని కావ్యవస్తువు తెలంగాణలో లేదు.

దాశరధి యే తెలంగాణము, తెలంగాణమే దాశరధి.

ఆయన గీతములు మహానగరములనుండి పల్లెపట్టులదాకా, శిధిలాలయములనుండి జైళ్లలోదాకా, ధనికునినుండి పేదవానిదాకా, మితవాదినుండి తీవ్రవాదిదాకా, ప్రసరించినవి.

ఓరుగల్లు శిల్పాలను చూచి ముగ్ధుడై దాశరధి, 'శిల్పిని' గూర్చి రచించిన పద్యాలు విశేష ప్రశస్తి నార్జించినవి.

సుత్తెల మ్రోతతో అలసి
చొక్కిన కొండల పిండు లెల్లనో
రెత్తి నిషాద మిచ్చినవి;
ఈ పెటు వంటి మనోజ్ఞ రూపకం
బెత్తు మటన్న నెత్తెదము;
ఎందుల కిట్టుల మట్టి మట్టిగా
మొత్తెదవోయి, శిల్పికుల
భూషణ, శైల శిలాప్రవేశనా.

*

నిను గని కొండలన్ని రమ
ణీ కుచశాలికలై, కపోల పా
షాణ ఫలకమ్ములై, భ్రుకుటు
లై, కుటిలాలక జాలమై, సురాం
గనలయి రూపు దిద్దుకొన
గా, ఉలితో అమృతమ్ము చల్లి జీ
వనములు పోసి పోయెదవు;
బ్రహ్మవు, శిల్పి కులావతంసమా!

*

మహారణ్యమయమైన తెలంగాణా భూమిని మాగాణమొనర్చిన రైతుదేగాని తెలంగాణము నైజాంనవాబుది కాదని నిజామాబాద్ సెంట్రల్ జైలులో సింహగర్జన మొనర్చినాడు దాశరథి

ప్రాణములొడ్డి, ఘోర గహ
నాటవులన్ పడగొట్టి మంచిమా
గాణములన్ సృజించి, ఎము
కల్ నుసిచేసి పొలాలు దున్ని భో
షాణములన్ నవాబు నకు
స్వర్ణము నింపిన రైతుదే తెలం
గాణము రైతుదే; ముసలి
నక్కకు రాచరికమ్ము దక్కునే?

*

శ్రీ దాశరథి రచనలను సంపుటీకరించి 'సాహితీమేఖల' వారు 'అగ్నిధార' ప్రచురించినారు. మేము మరికొన్ని రచనలను మరొక సంపుటిగా 'రుద్రవీణ' పేరుతో ప్రచురిస్తున్నాం. దాశరథి రుద్రవీణను సద్వినియోగం చేయడానికి ప్రయోగిస్తానంటున్నాడు.

చింతల తోపులో కురియు
చిన్కులకున్ తడిముద్దయైన బా
లింత యొడిన్ శయించు పసి
రెక్కల మొగ్గను బోని బిడ్డకున్
బొంతలు లేవు కప్పుటకు:
బొంది హిమంబయి పోవునేమొ! వా
యింతును రుద్రవీణపయి
నిండుగ వెచ్చని అగ్నిగీతముల్.

*

నిరుపేదల తరతరాల బీదతనం ఊడ్చివేయబడాలనే తొందర దాశరథి ప్రతి మాటలో వినిపిస్తుంది. దయనీయులైన శ్రామికులు దాశరథి అభిమాన వస్తువులు.

ఒకనాటికి ఈ కాలం పల్టీతిన్నప్పుడు
ఈ జగత్తు నవపాంచజన్యనాదం విన్నప్పుడు
నేటివన్నీ ఆనాటికి తప్పులు
పుచ్చిపోయి పురుగెక్కిన పప్పులు

పరిణామం తప్పదనీ పరిణామ వాదుల్ని హతమార్చాలనే ప్రయత్నం నిష్ఫలమనీ దాశరథి సలహా.

రుద్రవీణను దాశరథి రచనకు చిన్ని మచ్చుతునకగా ఆంధ్రరసికులకు అందించడానికి ప్రయత్నించిన మా కృషిలోని మంచిచెడుగులను పాఠకులు ఆదరముతో స్వీకరించగలరని ఆశ.

ఇందులోని కొన్ని రచనలు స్వతంత్ర మొదలైన పత్రికలనుండి సేకరించినాము. మాకు అట్టి అనుమతి నొసంగిన ఆయాపత్రికా సంపాదకులకు మా అభినందనములు.

తెలంగాణము మహాప్రజలచే అనేక మార్లు సన్మానింపబడి, సత్కరింపబడి, 'మహాకవి' 'కవిచక్రవర్తి' 'కవిసింహ' ఇత్యాది బిరుదములనందిన శ్రీదాశరథి తమ రచనలను సంపుటీకరించుటకు మాకు అవకాశ మొసగినందుకు వారికి మా ధన్యవాదములు.

ప్రకాశకులు

# అంకితము

[నా తెలంగాణకు]

నను:గని పెంచినట్టి కరుణామయి నా తెలంగాణ! నీ గృహాం
గణ వనసీమలో బరుసు కంపలు నాటిన మా నిజాము రా
జును పడద్రోసినట్టి రణశూరుల వెచ్చని నెత్రు చుక్కలే
మణికృత దీపమాలికల మాదిరి నీకు వెలుంగు లిచ్చెడిన్

పాటలు పాడితిన్ తెలుగుబాబులు నిద్దురమేలుకోగ, పో
రాటము సేయగా కరకు రాచరికమ్మును కూలద్రోయగా;
కోటి గళాల నొక్కకడ గూర్చితి విప్లవ శంఖ మొత్తితిన్
నాటికి నేటికిన్ తెలుగు నాటికి వెచ్చదనమ్ము లూదితిన్

వేయి స్తంభాల్గుడి వ్రాయించుకొన్నది
నాచేత ఏకశిలాచరిత్ర
వీర రుద్రమదేవి వినిపించుకొన్నది
నాచేత జన్మ జన్మాల కథలు
పోతన్నకవి కలబోయించు కొన్నాడు
నాచేత నేటి అనాటి కవిత
ముసునూరి కాపన్న మ్రోయించు కొన్నాడు
నాచేత క్రాంతి వీణా చయమ్ము

నాకు తల్లివి నీవు నే నీకు తండ్రి
నల్ల నాటికి నేటికి ననుదినమ్ము
మ్రోయు చున్నావు నా గళమ్మున, కళాన
నా తెలంగాణ! కోటిరత్నాల వీణ!

ప్ర ద ఏ ణ

తుంగభద్రానదీ భంగమ్ము లిరుక్రేవ
లొరసి పాడుచు రుచు లరయుచుండ
కృష్ణవేణీ తరంగిణి నాలుకలు సాచి
దరుల పెండిట 'మజా' లరయు చుండ
గోదావరీ వీచికా దివ్య హస్తమ్ము
లిరు కెలంకుల మన్ను తరచుచుండ
బోటి కిన్నెరసాని మాటి మాటికి పొంగి
రెండు వైపుల దరు లండ గొనగ

ఇటు నటును తెల్గునేల లారటము జెంది
కలసి పోఁజూచుచున్న యట్టులనె తోచు;
కలిపి వేయుమి, నా తెలంగాణ తల్లి!
మూడు కోటుల నొక్కటే ముడి బిగించి

నా కోర్కె తీర్పు మమ్మా!
నీకు మదీయాశ్రుకణ వినిర్మిత మాలా
నీకమ్ము సమర్పించెద
గాక; విశాలాంధ్రమనెడి కల నిజముగుతజా

# మంగళగీతి

మంగళ గీతి పాడెద హిమాచల శృంగ సరత్ సురాపగా
భంగ తరంగ రంగముల పాదములూని నటించు తారకా
లింగిత బాలచంద్రముని లీల తలన్ ధరియించినట్టి భ
స్మాంగుని ఫాలనేత్రము నవాగ్ని కణమ్ముల జిమ్ముదారులన్

కుంకుమ చిల్కరింతు నిదిగో! పరిగర్జిత మేఘ మాలికా
పంకిల రోదసీ కుహర భాగ దివాంధ భయంకరారభటీ
సంకుల కాళరాత్రి తెర జారిన నాటన శాలవంటి ప్రా
గంకమునన్ మదీయ ఘుసృణారుణ హస్త తలద్వయమ్మునన్

వెచ్చని మొల్లపూలు కురిపింతును శైశిర శీతవాత ఘా
తోచ్చలితాతిశుష్క లతికోద్గత నగ్నతతో చెలంగు యీ
గచ్చ పొదల్ గలట్టి వన కన్యక శూన్య ముఖాంగణమ్మునన్
పచ్చని మాధవ ప్రభుని బాహువు లెత్తిన పూలబుట్టతో

వెన్నెల కాగడాలకు ద్రవించెడి చీకటి కొండపైన కూ
ర్చున్న అనంత తారకలు రొప్పుచు రోజుచు జారివచ్చి ఈ
పున్నమనాటి చెంగలువ పూవులవోల్ వికసించెనో! యనన్
మిన్నులు దించి తెచ్చెదను మేచక వారిరుహా కరమ్ములన్

# మూర్ఛన

దొంతరలైన మబ్బులకు త్రోవలు చూపెడి మించుకాగడా
చెంత మనోజ్ఞ కావ్యము రచించు కవిన్ ననుజూచి భావనా
సంతతి నాగసర్పముల చాడ్పున వచ్చి నటించుచుండ వా
యింతును రుద్రవీణ నటియింతును పశ్చిమ దిక్తటమ్ములన్

కుంతలముల్ కపోలములకున్ దగులన్ నయనాంచలమ్ములన్
దొంతరలై నవాశ్రువులు దొన్క ప్రతీక్షణలో నిశాదివం
బెంతయు వంతతో కినియు నిద్దమతిన్ ప్రియురాలి గూర్చి ప
ల్కింతును రుద్రవీణపయి ఈహతసాంత్వన గేయమాలికల్

చింతల తోపులో కురియు చిన్కులకున్ తడిముద్దయైన బా
లింత యొడిన్ శయించు పసిరెక్కల మొగ్గనుబోని బిడకున్
బొంతలు లేవు కప్పుటకు బొంది హిమంబయిపోవు నేమొ; సా
గింతును రుద్రవీణ పయి నించుక వెచ్చని అగ్నిగీతముల్

గొంతుకలెండి, డొక్కలకు కొంచెము గంజియు లేకపోయినన్
పంతము నెగ్గగావలెను; ప్రాణము పోయినగూడ సమ్మెగా
వింతు మటంచు నాకట తపించెడి పేదల గూర్చి నేను ప్రో
గింతుచు రుద్రవీణ; పలికింతును విప్లవ గీతికావళుల్

# రససమాధి

పూవుల దారిలో యెడద పొంగులువార శరన్నిశా శశి
శ్రీ వలపించు చెంగలువ చేడియ కన్నులలో ప్రవాళ రే
ఖా విసరమ్ము తోచినటు కన్పడు నా అభినవ్య భావనా
దేవి ముఖాగ్రరక్తిమ కుదించుకొనెన్ కవితా ప్రపంచముల్

నా కవితా లతాంతము తృణమ్ములలో నయినన్ సువాసనల్
ప్రాకెడిరీతి పూచినది ప్రాతదనమ్మును త్రావి త్రేన్చి నా
జూకగు క్రొత్త వాసనలు చూపిన దీ రసికాంధ్ర సాహితీ
లోకమునందు నంతట; తళుక్కను వెన్నెల వెండి తీవెలన్

రస సమాధిని తన్మయిత సుమనస్సు
కాంచిన సురాంగనా కుచ కలశ లిప్త
దివ్య కస్తూరికా నీల దీప్తి లోన
గగనములు నృత్యమొనరింప గలవు కాదె!

అశ్రు బిందువు లందున విశ్రమించు
సప్త జలధి సంఘమ్ములు శక్తి కొలది
హసిత చంద్రుని కనిపెంచి ఆకసమున
పెద్ద జేసిన వీ జగంబే హసింప!

# ఉషస్సుందరి

మంద సమీర బాలికలు మాటికి మాటికి నీ గృహాంగణం
బందు నటించు చున్నవి మహావిభవమ్ముల గూర్చుచున్న వా
నంద కళావిలాసిని! క్షణక్షణ మోహిత రూపిణీ ఉష
స్సుందరి! నిద్ర మేలుకొని చూడుమి నా నయనాల లోనకున్

నా నయనాలలో ప్రళయనర్తనశీలి మహానటుండు ఈ
శానుడు ఫాలలోచనుడు సాచిన అంగుళికా నఖాంకుర
శ్రేణుల భగ్గు భగ్గుమని రెచ్చిన అగ్నిని పోలియున్న వి
భూ నభముల్ వడంకునిక మోమును నావయిపున్ మరల్పుమా

నా వయిపుకా మరల్పుమి మనస్విని! ప్రప్రధమానురాగ వే
ళా వలమాన తావక విలాస ధృశాంచలముల్ మదీయ ప్రే
మా వృత మానస హృదయమందున పూచిన క్రొత్త క్రొత్త రా
జీవములన్ గ్రహింపుమి నిశీథ తమః పటల ప్రభంజనీ!

చీకటి నీడలన్ కలత జెందిన నా జలజాత వల్లికా
నీకము ప్రాకివచ్చినది నీ ఇలు జాడల పూత బూయగా
వాకిలి మూసి యుంచకుము ప్రాగరుణారుణమూర్తి పాదముల్
సోకగనిమ్ము నా జలజసుందరి దివ్య శిరఃప్రదేశమున్

రాత్రి యంతయున్ నిదుర రాక ప్రవాళ రుచిప్రసర్పణ
స్ఫీత దృశాంచలమ్ముల తపించెడి నా మొగమందు రక్త రా
గాతి మనోజ్ఞ బాల రవి హాస వికాసము వచ్చి వ్రాలి ఆ
హూతము సేయుచున్నది మహోజ్జ్వల ప్రాచ్య దిశాంగణానకున్

అంగుళికా నఖాంకుర మహః పరికంపిత తంత్రికా స్వరా
లింగిత రుద్రవీణ విదళించిన నిద్దుర భారముల్ నభః
ప్రాంగణమందు పిట్టలయి ఆకసమెక్కిన వింక లే ప్రభా
తాంగన! నీ కపోలముల కద్దెద నౌషసరక్త రాగముల్

రమణీయార్క మరీచి మాలిక తమిస్రా ఘోర గాఢాంధకా
రములన్ పిప్పి యొనర్చి కాంతిరసధారల్ పిండి ప్రాచీన దే
శములన్ వాగులు పోయుచున్నది; ప్రతీక్షా మగ్న మాదృక్ ప్రజా
సముదాయమ్ముల దప్పి తీర్పుమి ఉషస్సంధ్యామృగీ లోచనా!

నా రుద్రవీణ మీటెడి
తీరులు చూపింతు నీకు' తెరువుమి తూర్పుం
దారులు; బారులు తీరిన
సూర మరీచికల నింట చొరబడనిమ్మా!

# మేలుకొలుపు

సంజ వెలుంగులో మొయిలు చాటున పక్కన నవ్వు చుక్కలో
పుంజితమైన రాతిరి కవుంగిట నిద్దురపోవు చందమా
మం జపియించు చెంగలువ మానిని కన్నులలో ప్రవాళరే
ఖం జతసేయ భాను కర కంజము లోకము మేలు కొల్పెడిన్

ప్రాత దనాల భారమున వ్రాలిన నెన్నడుముల్ గలట్టి ఈ
భూతల. భామినీ హృదయ ముగ్ధత కన్నుల నీరుదొచ్చు గా
దా! తరుణారుణార్క కరతర్పిత నవ్య విభాత బాండ సం
ఘాతవిభా జలమ్ములు జగమ్మును నిద్దుర మేలు కొల్పెడిన్.

# స్వామి పూజ

నీ వరుపెంతువా! శశిమణీ మయదివ్యజటావిలాసి, స్వా
మీ! వలమాన పశ్చిమ సమీర కుమారములూడ్చివేసె నా
పూవుల తోటనంతయును; మొక్కలు బిక్కమొగాలు వేసె; ల
జ్జా వశతన్ విసమ్రత వొసంగె; నినున్ గయిసేయు టెట్లురా!

దివ్య నదీ జలాలు కొనితెచ్చి ఒసంగితి, మాలతీ లతా
నవ్య లతాంత సంతతుల నంజుకొనన్ జనుదెంచు భృంగ జా
ల వ్యథనుండి కాచితినిరా! దురదృష్టమునాది, పశ్చిమా
శా వ్యపదేశ వాతములు సర్వము శూన్య మొనర్చె నంతలో!

పడమర గాలి తాకిడికి వాడియు రాలిన పూల జాలులో
యెడదయు వాడి పోయినది; యెట్టుల నిన్ గయిసేతునింక నీ
అడుగుల సవ్వడిన్ వినిన యంతనె నా నవనాడు లెందుకో
గడగడలాడు, నేత్తురులు కన్పడు నా నయనాంచలమ్ములన్.

స్వామి! నిశాగమమ్ము పరసంధ్య: స్మశానపు బూదిలోన నే
డో మెరపొందు చున్నది; పడుల్ పదివందలు వేనవేలుగా
భూమిని డాగి పోయిన కవుల్ రసికుల్ విడిపోయినట్టి ఆ
శేముషి నిప్పురవ్వ వలె చిన్నదిగా మెరపొందు చున్నదో!

నీవు సమంగళాకృతివి నేనును నీవలె ఈ స్మశాన వా
టీ వసతిన్ వసింతును నటింతును నీ కనుసైగలందు; సం
ధ్యా విశద ప్రదేశమున తాండవ మాడుదు; రుద్రవీణ క్రొం
దీవెలపై ధ్వనింతును గతించిన నా వన వైభవమ్ములన్.

నీకు మదీయ రక్త కణ నిర్మితమైన ప్రవాళ మాలికా
నీకము తెచ్చి యిచ్చెద; రణించెద నా నవనాడులందు వీ
ణా కమనీయ గీతములు; నా బ్రతుకంతయు కప్పురంబు గా
నీకు నివాళి నిచ్చెదను నిక్కము; చంద్రకళా శిఖామణీ

ఈ కొరగాని లోకమున కిప్పుడె నిప్పురగిల్చి కాల్చి, నా
లో కదలాడు నూహలకు రూప మొసంగి పునస్సృజింతు; న
ర్రాకట గుందు పేదలకు బ్రహ్మ లిఖించిన కొంటెవ్రాతలో
వ్యాకరణమ్ములేదు, రసభంగిమ కానగరాదదేలనో!

ఫాల నేత్రమ్ము విచ్చి లోకాలు కాల్చి
నృత్య మాడుము, తీగె సారించి నేను
రుద్రవీణ మ్రోగింతును భాద్రపద ప
యోద గర్జాభికల్పమ్ముగా, దివమున.

# పచ్చని గడ్డిపై

పచ్చని గడ్డిపై కరకు
పాదము లెంతటి కక్షబూనెరా!

మచ్చుకు గడ్డిపోచ కను
పట్టదు! దైవము గూడ ఈ క్రియన్

మెచ్చిన యట్టు లూరకొనె;
నేడు హటాత్తుగ వానజల్లులే

వచ్చిచనెన్; ధరాతలము
పచ్చబడెన్ మరలన్ తృణాళితో

# వీర తెలంగాణము

ఓ తెలఁగాణ! నీ పెదవులొత్తిన శంఖ మహారవమ్ము లీ
భూతలమెల్ల నెక్కుమొగి బొబ్బలు పెట్టిన యట్లుతోచె; ఓ
హో! తెలవార్చి వేసినవి ఒక్కొకదిక్కు నవోదయార్కరుక్
ప్రీత జలేజ సూన తరళీకృత దేవ నదీ తరంగముల్

తల్లీ నీ ప్రతిభా విశేషములు భూతప్రేత హస్తమ్ములన్
డుల్లెన్ కొన్ని తరాల దాక! ఇపు డడ్డుల్వోయె సౌదామినీ
వల్లీ పుల్ల విభావళుల్ బ్రతుకు త్రోవల్ చూపు కాలమ్ములన్
మళ్లెన్! స్వచ్ఛతరోజ్జ్వలప్రథమ సంధ్యా భాను వేతెంచెడిన్

నీ ఒడిలోన పెంచితివి నిండుగ కోటి తెలుఁగు కుఱ్ఱలన్!
ప్రాయము వచ్చి నంతనె కృపాణము లిచ్చితి యుద్ధమాడి వా
జ్రేయ భుజాబలమ్ము దరిసింప జగమ్ము నవాబుతో నవాల్
చేయుమటంటి వీ తెలుగు రేగడిలో జిగి మెండు మాతరో!

తెలగాణమ్మున గడ్డిపోచయును సంధించెన్ కృపాణమ్ము! రా
జ లలాముండను వాని పీచవడచన్ సాగించె యుద్ధమ్ము! భీ
తిలిపోయెన్ జగమెల్ల యేమియగునో తెల్యంగ రాకన్! దిశాం
చలముల్ శక్రధనుః పరంపరలతో నయ్యాటలాడెన్ దివిన్

నాలుగు వైపులన్ జలధి నాల్కలు సాచుక కూరుచుండె! క
ల్లోలము రేపినారు గదిలో! నలుదిక్కుల గండికొట్టి నం
ద్రాలకు దారి నిచ్చిరి! ధరాతలమెల్ల స్వతంత్రవారి ధా
రా లులితమ్ము కావెడగె రాజు రివాజులు బూజు పట్టగన్

తెలగాణా! భవదీయ పుత్రకులలో తిండ్రించు వైష్ణవ్య సం
చలన మ్మూరక పోవలేదు! వసుధా చక్రమ్ము సారించి ఉ
జ్జ్వల వైభాతిక భానునిన్ పిలిచి దేశంబంతటన్ కాంతి వా
ర్ధులు నిండించిరి, వీరు వీరులు పరార్ధుల్ తెల్గుజోదుల్ బళా!

ఓడి పోలేదు దుర్యోధనాదుల కన్న
బాధించిన నవాబు వాని చేత
చలియింప లేదు దుశ్శాసనాధము వోని
వస్త్రాపహరణ ధూర్వహుల జూచి
వెనుకాడ లేదు స్త్రీలను మాన భంగాల
పాలుచేసిన పాపి భటుల గాంచి
కన్నీరు కార్చలే దెన్నండు పిరికిగా
ప్రాణాలు గోల్పోవు ప్రజల నరసి
పోరుసల్పిరి వీరాధి వీరులట్లు!
భరత వైజయంతికల స్థాపన మొనర్ప
నెత్తురులు ధారవోసిరి నీళ్ల వోలె!
మానితులు నీసుతుల్! తెలంగాణ భూమి!

మత పైశాచి వికార దంష్ట్రికలతో మాభూమి లంఘించి మా
కుతుకల్ గోసెడి వేళ గూడ యిటు దిక్కుంగా తోచకున్నప్పుడుం
బ్రతుకే దుర్భరమైన యప్పుడును ఆంధ్రత్వమ్ము పోనాడ లే
దు తుదిగా గెల్చితిమమ్మ యుద్ధమున రుద్రుల్ మెచ్చనాంధ్రాంబికా!

కాకతీయుల కంచు గంట మ్రోగిన నాడు
　　　　తురక రాజుల కు తత్తరలు పుట్టె
వీర రుద్రమదేవి విక్ర మించిన నాడు
　　　　తెలుగు జెండాలు నర్తించె మింట
కాపయ్య నాయకుం డేవు సూపిన నాడు
　　　　పరరాజులకు గుండె పట్టుకొనియె
చాళుక్య పశ్చిమాశా పాలనమ్మున
　　　　కళ్యాణ ఘంటలు గణ గణ మనె
నాడు నేడును తెలగాణ మోడలేదు
శత్రువుల దొంగ దాడికి శ్రావణాభ్ర
మటుల గంభీర గర్జాట్ట హాసమలరు
నా తెలంగాణ పోవు చున్నది పథాన.

# ముక్త భూమి

అవి తెలంగాణమందు దావాగ్ని లేచి
చుట్టు ముట్టిన భీకరాశుభ దినాలు;
అవి నిజాము నృపాలు ని అండ దండ
చూచుకొని నిక్కినట్టి పిశాచి కలలు

నాడు మానవతీ నయనమ్ములందు
నాగ సర్పాలు తలలెత్తి నాట్య మాడె
నాడు మానవతా నవ నాగరకత
తన్ను తిన్నది రాక్షసత్వమ్ము తోడ.

భారతభామినీ నయన భాగ వినిర్గత రక్త బాష్ప శ్పం
గారిత కాల రాక్షసి వికావిక నవ్విన నిస్స్వనమ్ములో
తూరుపు ఊరువుల విడచి తొందర పడ్డది తెల్లవారగా-
ఘోర నిశా తమః పటల గుంఫిత నీల నభః పథమ్ములన్

తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైర భారత భూమి చూపడెనొ లేదొ
విషము గుప్పించి నాడు, నొప్పించినాడు
మా నిజాంరాజు, జన్మ జన్మాల బూజు

# ముక్తభూమి

బారతమాతృ గర్భమున బల్లెము గ్రుచ్చిన దుండగేంద్ర కా
దారముగా నిజాంనృపతి తాళముతీసిన పెద్దపెద్ద బం
గారపు బొక్కసాలు పసికట్టెను తెల్లదళారి! అంతలో
బేరముసాగె పోరు జరిపింప తుపాకులు దింపుకోసమై

పరశునిశాత ధారలను పచ్చనిగడ్డి యెదిర్చినట్లు, రా
చరికపు టుక్కు చట్టమును చల్లగ ధిక్కరణమ్మొనర్చె ను
స్నురనేడి పేదవాడు! కడుచోద్యము! వెచ్చని స్నాన మాడె సుం
దర తరభామినీ నయన ధారల భారత మాతృ పాదముల్

కోటితెలుంగు లొక్కమొగి కో యని పిల్చినయంతలోనె ఆ
రాటముచెంది భారతధరా తలమంతయు సంచలించెఁబో,
కూటికి లేని పేదలకు గూడను పౌరుషమా! యటంచు స్త్రీ
కోటిని మానభంగములకుఙ్గురిజేసిరి ముష్కరాధముల్

చల్లని మంచు కొండలు బుజమ్మున మోసెడి భారతమ్ము శాం
తిల్లె నిజాము నీల్గుడులు తేటపడంగలదాక! అంతలో
భొళ్లున కుండ బ్రద్దలయి పోయెను, భారతమాత డొక్కలో
కుళ్లిన పుండు కోసి జయగోపురమెక్కె త్రివర్ణకేతనాల్.

హారాసనున్న చుట్టము
హారానసె ఆగె! తెల్లదొంగ సభస్థిం
చారి యయిపోరె, స్వేచ్ఛా
భారత సైన్యమ్ము తలుపు బ్రద్దలు కొట్టఁ.

ఎదురెక్కి యున్న జలములు
నదులై చొరబారె నింటి నడుమఁ: దాముం
డదనున బాణము వదలెను,
మదమణగెఁ మా నిజాము మారీచునకుఁ

రెండు వందల యేండ్ల చరిత్ర పుటల
కప్పుకొని యున్న గాఢాంధకారమెల్ల
కొట్టుకొని పోయె, తూరుపు మిట్టనుండి
పారివచ్చిన వెలుతురు వాగులోన.

మూడవ పాలు తెల్గు పటముఁ తనపాలికి కత్తిరించు కొ
న్నాడు కదా నిజాము నరనాథుడు మున్నొక రెండుమూడు నూ
రేడులనాడు! వాడు తొలగించిన ఆంధ్రమహాపతాక క్రీ
నీడలు నాగుపాములయి నేటికి కాటిడె వాని వంశముఁ

గ్రామికుని వేడిఁ నిట్టూర్పులకు ప్రపంచ
మెన్నడే కాలి బూది కానున్న దేమొ!
లేనిచో అద్రికానన శ్రేణులెల్ల
మెండవడ గాలి కిట్లేల మండి పోవు?

# అగ్ని సంసమము

ఓసి, కూలి దానా! నవాభ్యుదయ వేళ
మంటి తట్ట నెత్తిన బెట్టి మరుగులేని
యెత్తు రొమ్మును పొంగించి యెందుకొరకు
ఉస్సురనెదవె ఆకాశ ముడికి పోవ?

అంబర చుంబి సౌధముల కాయువు బోసెడి నీశ్రమప్రభా
వంబు నెరుంగలేని ధనవంతుల బంగరు పళ్లెరాలలో
అంబలి పోసి త్రావు సమయమ్ములు దగ్గరె లెమ్ము! నీ నవా
స్యంబున రుద్రనేత్రవిలయాగ్నుల కుంకుమ బొట్టు పెట్టుమా!

వ్రాసి వ్రాసి పాత్రమ్ములు మాసి, నా క
లమ్ములో సిరా ఇంకి రక్తమ్ము పోసి
అరుణ తరుణాక్షరాల కావ్యాలు చేసి
ఆకలికి మాడిపోయెద, నీ కొరకయి.

పేదను 'ధర్మభిక్షమును పెట్టు' మటంచు తపించుచున్న జీ
ర్ణోదర మెత్తి చూప, తృణమో పణమో పడవేయ తృప్తితో
పోదు రటన్న కాలములె పోయెను; పేదల రక్తమాంసముల్
గాదెల స్వర్ణమై నిలువగా ధనవంతుని యాజమాన్యమా!

## అగ్నికుసుమము

లేదు, లేదు చల్లారగా లేదు, పేద
వాని గుండియలోని స్మశాన వహ్ని
కాల్చి వేయును, బంగారు గద్దె లెక్కి
పేదలను సిగరెట్లుగా పీల్చువారి.

# సుప్రభాతం

ఓ నిర్భాగ్య నిరీహ నిర్బల నిరుద్యోగప్రజా! నీ యుగా
గ్రానన్ వంద తరాల పేద తనముల్ రాక్లత్రి! శుష్కోదర
శ్రేణుల్ కాలె క్షుధా స్మశానముల! విచ్చెన్ వహ్నిపుష్పమ్ములీ
శానస్ఫార నిటాల భూమి నయనాంచద్వల్లికాగ్రమ్మునన్

నాచేత రుద్రవీణా తంత్రి మీటించి
ప్రాచీ దిశా రక్తరంజి తోద్యానమ్ము
లో చిన్ని కాలాగ్ని వల్లికను నాటించి
వేచి యున్నది వచ్చుటకు భవిష్యద్దేవి

మీరు మీమీ నర నరమ్ముల
మేటి పాటలు పాడు కోండీ,
మీరు మీమీ తర తరమ్ముల
అనుభవమ్ముల వాడుకోండీ.

నీలి దారుల
కాలు మోపిన
సూర్యదేవుని
చురుకు చూపులు,నావి.

నావికుని బుజాల ఊపులు
తోసి పారేస్తోన్న నీళ్లకు
తొణికిపోయే పడవ మీదే
చిన్నిసౌధం కట్టుకుంటా ——నేను.

మీరు ——ప్రజలారా,
నిశా శ్శంఖం
ధ్వనించిన
కటిక చీకటి
గుండె శబ్దం
వినండి, వినండి.

మీ నాగేటి కర్రు
రుచి చూచిన
భూమితల్లి పెదవుల తీపి
చెబుతోన్న
సాక్ష్యం వినండి, వినండి.

ఈ భూమి మీది,
ఈ సీమ మీది,
కదల కండి
వదల కండి
నరాలు, బొమికలు

బలించేస్తాయి
చూపండి, కానీ
వదలకండి మీ భూమిని.

నాగటి చాళ్లలో
నడిచే రైతులార!
మీ నిశ్శబ్ద గళాలు పాడిన
గీతా రహస్యాలను
బధిర లోకానికి వినిపించే
నా రుద్రవీణ, ఇదో!

కదలెను తూర్పు వాకిలి మొగాన బిగించిన తల్పురెక్క: భూ
వదనము నందు కుంకుమము భగ్గున మండిన దగ్గిపెలె: నా
హృదయ కవాట మిప్పుడొనరించెడి చప్పుడు బట్టిచూడ, నా
పద మేదియో తుపాను వలె వచ్చునటుల్ కనుపించు నేలనో?

# రానున్నది

రానున్నది యేది నిజం?
అది ఒకటే, సోషలిజం

కలపండోయ్ భుజం భుజం
కదలండోయ్ గజం గజం

ఆడు గడుగున యెడద నెత్రు
మడుగులుగా విడవండోయ్

పడిపోయిన గుడి గోడలు
విడిచి పెట్టి నడ వండోయ్

ఉదయాకాశ పతాకం
యెదలో కదలాడె నేడు.

హృదయావేశ తటాకం
నదిలా పొరలాడె నేడు

రానున్నది యేది నిజం?

# రుధిర పక్షులు

నీలి మబ్బులు
తేలి యాడే
నింగి నిండా
రుధిర పక్షులు

రుధిర పక్షుల
రెక్క బరువును
కూలిపోయిన
గాలి సౌధం.

గాలి సౌధం
పునాదుల్లో
కాళ్లు విరిగిన
కొత్తరాజులు'.

కొత్తరాజుల
గుండియల్లో
వచ్చి వ్రాలిన
పక్షి రెక్కలు.

పక్షి రెక్కల
పదను కోతకు
తెగిన కాలం
కొత్త రంగులు—

రు ధి ర ప క్షు లు

పేద పొదలు
స్వేద బిందు
స్వాదు రుచితో
పొంగు రంగులు.

నేను మీటే
రుద్ర వీణకు
స్వరం నేర్పే
రుధిర పక్షులు.

దిక్కు దిక్కులు
ముక్కు మొనతో
రెక్క వచ్చిన
రుధిర పక్షులు.

రుధిర పక్షులు
రుధిర పక్షులు

బధిరలోకం
ప్రాణ వాయువు
బాగుచేసే
రుధిర పక్షులు.

చీక టింటికి
చిన్ని కిరణం
తెచ్చి విడిచే
రుధిర పక్షులు.

కాలమార్గం
మీద నడచే
'కాపు' వైపుకు
గాలి వీచే
రుధిర పక్షులు
రుధిర పక్షులు

# కవాటం

గతాన్ని
విస్కీగా తాగిన
కవిస్నేను!
భవిష్యత్తు నిషా నిజం

శ్రమజీవుల స్వేదం —
పొంగిన లవణ సముద్ర తరంగం,
లవణ సముద్రం పెంచిన
భవితవ్యం — అమృతకిరణ
చంద్రబింబ పౌర్ణమాసి.

ప్రాగ్దిశా నివాసులార!
పేదలార!
మీరేనా? చీకటింటి
తలుపు తోసి
పిలుస్తోంది మీరేనా?
రక్త కవాటం కిర,కిర!

ఎగిరిన
చిన్ని చిన్ని పర్వతాలు

రాబందులు!
రాబందులతో పోరాడే

శవాల గత ప్రాణాలు!
విముక్తి కోసం పోరాడిన
సమరవీరులు సమాధి శిఖరాల్లో
సింహాసనాలు వేసుకు కూర్చుండిన
కొత్తరకం పరిపాలకులారా!
శవాలు బ్రతికాయి, లేస్తాయి.
మీతో మల్లీరణం చేస్తాయి.

గతవీరుల దివ్య సమాధుల
పూలు దొంగలించి పోయి
నిప్పులు కురిపించు తున్న
కొత్త రకం పాలకులారా!
ద్రోహం, అన్యాయం, కృత్రిమం.

చుట్టు కున్న చీకటి పరదా
దించి, దించి
కవాటాలు మూసి మూసి
హద్దులు కాపలాలు కాసి
వెలుతురు సీసాల వోసి
కార్కు వేసి సీలు చేసి!—
అన్యాయం, ద్రోహం, కృత్రిమం.

అగ్ని పతాకం రెక్కలు
విచ్చుకున్న ఆకలి డొక్కలు
పని పట్టిన సర్ప ఫణమ్ములు
తరతరాల
దావాగ్నిని

వడగట్టిన
వర్తమాన రేఖలు
పేలిన తుపాకీ గుండ్లవర్షం—
తలవంచని మాన ప్రాణాలకు హర్షం!

ఓ ప్రాచీ దిక్కువాసులారా!
నాగటి చాళ్ళల్లో నడిచే
రైతులారా! రుద్రులార!
మర చక్రం గిరగిర తిప్పే
కూలీల్లార! వీరభద్రులార!
మీరేనా? చీకటింటి
తలుపుతోసి పిలుస్తోంది?
రక్తకవాటం కిర్ర, కిర!

# మహాగీతం

చరిత్రపాడని ధరిత్రిచూడని
పవిత్రగీతం పాడండి
విచిత్ర భూతం చూడండి

నరాలలో తరతరాల గాథలు
శిరస్సులో నరనరాల బాధలు
గిరి శిరస్సుపై హరీంద్ర గర్జన
మన మనస్సులో తర్జన భర్జన
పర ప్రభుత్వపు ఉరికంబాలు
ప్రజాప్రభుత్వపు గజిబిజిచర్యలు
స్వతంత్రమంటూ పెద్ద మాటలు
కుతంత్రాలతో గ్రుద్దులాటలు
విన్నాం కన్నాం కన్నాం విన్నాం

చరిత్రపాడని ధరిత్రి చూడని
పవిత్రగీతం పాడండీ
విచిత్ర భూతం చూడండీ

ఊరిఊరి పొలిమేరలుమారీ
దేశదేశ సహవాసంకోరీ
జాతిమతాలను పాతరవేసీ
సామ్రాజ్యాలకు సమాధిచేసీ
అడుగు కడుగునూ మడుగులు కట్టిన
యెడద నెత్తురులు వడబోయించీ

ముల్లుముల్లుకూ చిమ్మిన రక్తం
గులాబీల రంగులై వెలిఁగీ
యూరపు, తూరుపు, ఏషియా, రషియా
భారత, సింహళ, బర్మా, వీట్నాం
అమెరికా, బ్రిటన్ శ్రమజీవులతో
శ్రమజీవులతో, సమభావులతో
అమర్చి కూర్చిన, జగాన్ని మార్చిన
విశాల విశ్వశ్రామిక భూతం
మహోగ్ర భూతం
ఉల్కాపాతక
ఉత్తర ధ్రువాత్యున్నత శీతం
వజ్రాఘాతం
ప్రళయోత్పాతం—

పరుగెత్తే హిమగిరి
ఎదురు నడచు గంగాఝరి,
కంపించే ఇలా తలం
కదలాడిన గభీర సముద్రజలం
పేలిన కోటికోటితారలు
కురిసిన ప్రళయ వర్షధారలు,
గ్రీష్మంలో తగులబడే
పెద్ద పెద్ద కొండలు,
కరువులతో వణికిన
నిరుపేదల గుండెలు,
కేంద్రీకృత, పీడిత భూతం—

విరాట్ స్వరూపం
మహేంద్ర చాపం
ఉచ్ఛ్వసించితే, నిశ్శ్వసించితే—
నింగి నంటు డాలరు గోడలు
నిల్గుతున్న బాంబుల మేడలు
నుగ్గునుగ్గుగా తగ్గిపోవునట!

"అద్ది రక్త గంగా తరంగమా?
అంత్య మహా యుద్ధరంగమా?"

"అమృతం ముందరి హలాహలం
పంటలు సిద్ధం కానిపాలం
ఫలితానికి ముందటి త్యాగం
నిరుపేదల నెత్తుటి రాగం
పడగెత్తిన మహోగ్ర నాగం
తగలబడే ధనికుల భోగం
అరుణారుణ విప్లవ మేఘం
నవయుగ మహా ప్రజౌఘం."

"ఆ మహాతరంగానికి అవతల?
ఆయుద్ధరంగానికి అవతల?"

"నిజమైన ధ్వజమెత్తిన కల
గగనానికి నిక్కిన పేదల తల
ఉక్కుటడుగు త్రొక్కిడిలో
పడి నలిగిన గడ్డిపోచ
చెక్కుచెదర కొక్కుమ్మడి

వక్రవడిన ఇనుప ఊచ
చనిపోయిన మృత్యు శవం
వినిపించని ఘనారవం,"

చరిత్రపాడని ధరిత్రి చూడని
పవిత్ర గీతం పాడండి
విచిత్ర భూతం చూడండి

# రుధిర దీపిక

మబ్బుల మస్తిష్కమ్ముల
మెరసిన ఇంద్ర చాపమ్ములు,

పచ్చని గడ్డిమళ్లలో
విరిసిన ఇంద్ర గోపమ్ములు;
ఇవి వర్షానికి గొడుగులు
ఇవి హర్షానికి షరతులు.

అవునా
ఈ ఇంద్ర ధనుఃఖండమ్ములు
ఒకనాటికి కాలదండమ్ములు?
ఈ యెర్రని ఇంద్ర గోపమ్ములు
ఒకనాటికి రక్తరూపమ్ములు
కానోపు—

మానిశానిర్ఝర జీవితరంగమ్ములు
నిజమ్ముగా విషగంగా తరంగమ్ములు.

ఒక నాటికి ఈకాలం పట్టితిన్నప్పుడు,
ఈ జగత్తు
నవపాంచజన్య నాదం విన్నప్పుడు
నేటి వన్నీ అనాటికి తప్పులు
పుచ్చిపోయి పురుగెక్కిన పప్పులు.

ఆవునుకదా, ఆనాటికి
ఈనాటి వంకర నాగేటికి
యెంత విలువ? యెంతచలువ?

ఈ చరిత్ర చీకటి గదిలో
ఈ ధరిత్రి అమ్మల పొదిలో
తైల దీపం వెలుతురు తో
వెదకి వెదకి వేసారినా
లభించేది కనిపించేది—

పెద్దల,
విద్యావంతుల,
ధన రాజుల,
తరతరాల బూజుల,
పొత్తి పాతగాజుల
విలువలు:

చిలువలు పలువలుగా
అల్లి, కల్పించి చెప్పే అబద్ధాలు

రాజాధిరాజుల
మార్తాండ తేజుల
పురుషత్వపు, పరుషత్వపు
అల్లి బిల్లి, అల్లిక బిగి కథలు,

ఆవునా,
అనాథ విశ్వ శ్రామిక మూర్తి!

ఆగామి యుగ పరివ్యాప్తకీర్తి!

నీ నరనరాల నడిచే
'నయాగరా' 'గెర్సొప్పా'

రుధిర 'జలపాత' ధారలో—
నీ కన్నీటి చారలో
జని యించిన
జగాన్ని పెంచిన
దేవుళ్లను దెయ్యాలను మించిన
అరుణారుణ విద్యుద్దీపిక
వెలిగించుకో—

తొలగించుకో
యుగయుగాల
పేదతనం బరువులు,
దేశదేశాల
బీదజనం కరువులు,

లే, తండ్రీ!
లయరుద్ర, మహానుభావ!
ప్రియవిశ్వశ్రామికదేవ!

లే, తండ్రీ!
చూపించు
నా యీపాపపులోకం
పడిపోయే చీకటిదారుల

ఎగుడు దిగుడులు!
వెలిగించు తండ్రీ!

విరించి పుట్టక ముందు నించీ
మంచులో పొంచుకు కూర్చున్న
పీ యూషవాపిక
ఈ రుధిర దీపిక

# అనంత సంగ్రామం

అనాదిగా సాగుతోంది
అనంత సంగ్రామం
అనాథుడికి, అగర్భ
శ్రీనాథుడికి మధ్య.

పేదల రెక్కల కష్టం
బూదిలోని పన్నీరే;
కదలని మెదలని సేటుకి
గాదె నిండ బంగారం.

సేద్యం చేసే రైతుకి
భూమి లేదు పుట్రలేదు;
రైతుల రక్తం తాగే
జమీందార్ల కెస్టేట్లు

మిల్లు నడిపి కోట్లడబ్బు
కొల్లగ లాభం తెచ్చే
కూలీలది కాదు మిల్లు;
మిల్ మాగ్నెటొక సేటు.

శత్రువులను యుద్ధంలో
చిత్రంగా వధచేసిన
పేదసైనికుడికి సున్నా
రాజ్యమంతా రాజులదే.

# అనంత సంగ్రామం

మధన పడ్డ మేధావులు
శాస్త్రజ్ఞులు, విద్వాంసులు
కనిపెట్టిన అణుశక్తికి
ప్రభుత్వాల కంట్రోళ్లు

కర్షకులు, కార్మికులు
మధనపడ్డ మేధావులు
తమ శ్రమలకు తగినఫలం
ఇమ్మంటే 'తిరుగుబాటు'

షావుకారు వడ్డీలకు
జమీందారు హింసలకు
వేగలేక ఆగలేక
ఎదిరిస్తే 'కమ్యూనిస్టు'!

అనాదిగా సాగుతోంది
అనంత సంగ్రామం
అనాధుడికి అగర్భ
శ్రీనాధుడికి మధ్య

# హిమధామం

ఈ ఉత్తరదిశా
వాయుమండలం
గాలిలో తేలుతున్న
హిమాచలం.

వేనవేల మణుగుల
మంచు బరువు,
ఇక్కడ వేండ్రానికి
వెచ్చదనానికి కరువు.

సుదీర్ఘ
చైనా కుడ్యానికి
రెండు పక్కలు —
మంచు పెట్ట
రెండు చెక్కలు.

మహానది
ఉత్తర దక్షిణ తీరాల
నీళ్లు లేవు,
అంతా మంచు నేల.

నర్తించే సుదీర్ఘ
రజత సర్పాల
దండలు
ఈ కొండలు.

మైదానంలో
పొంగిన పర్వతాలు—
మెరుస్తో, తెల్లని
ఐరావతాలు,

అంతా చల్లదనం
ఎంత హాయి!

నా ఔన్నత్యం
ఈ ఆకాశంతో
పోటీ పడాలని
ఆరాట పడుతోంది.

ఈ మృదుల ఉషస్సులో
నా భూమి—
అరుణ కపోలాల బాల
తెల్లని గౌను తొడుక్కున్నట్టుంది.

ఈ కొండలూ, నదులూ
ప్రతిధ్వనిస్తూ పిలుస్తున్నాయి—
"వీరులార! ధీరులార!
పోటీ పడండి, రణం చేయండి,
గెలవండి, ఠీవిగా నిలవండి.
మమ్ము ప్రేమించండి
మా హృదయ సింహాసనాలు
అలంకరించండి."

'షై-హూ-అంగ్', 'హొ-చు' సమ్రాట్టులు
పశువులు—
అచ్చంగా
రాక్షస శిశువులు.

'తై-సుంగ్,' 'టై-సూ' చక్రవర్తులు
అనాగరికుల్లు
క్రూరులైన ఎరుకులు.

చంగీజ్ ఖాన్
పిచ్చుకపై
బ్రహ్మాస్త్రం గుంజేవాడు!

అదంతా గతం,
నేటితో అది ఖతం

నేటి మానవులు
తమను తాము
తెలుసుకొన్న
ప్రభాత రవులు,
నిండు హృదయాల కవులు—
నేటి మానవులు

(మూలం: మావో సే-టుంగ్)

# శిల్పి

సొగిల దీసి రాళ్ల నొక జాలుగ వాగుగ తీగలాగునన్
లాగెద వెట్టు లన్న నటులన్ ప్రియురాలి పయంటలో అజం
తా గుహలోని స్వప్నములు దాచిన నీ ఉలిముక్కు లోపలన్
దాగుడు మూతలాడె కవితా లలితాంగి రహో విహారముల్.

రాలు మలంతు వీ వని వరాలును కుప్పలు పోసి రాణివా
సాలకు గొంచుబోయి ఒక చక్కని జాణను చెక్కు మంచు ర
త్నాల నొసంగినారు నరనాథులు; తేజవరాలిమోవి స్తం
భాలకు చెక్కినావు; ఉలి పన్నుల నొక్కులు తాకనట్లుగా.

నీ ఉలి చూచి ప్రస్తరము నీరయి పారును; వెన్నముద్దపై
చేయిడి యెత్తి నట్టుల; నిశీథములం దభిసారికా పదా
బ్జాయత రాగరంజిత న వారుణ కంటకపాళి గూర్చి నే
గేయము వ్రాసినట్లు; విలిఖింతువు లోతగు భావముల్ శిలన్.

నిను గని కొండ లన్ని రమణీకుచపాళికలై, కపోల మో
హన ఫలకమ్ములై, భ్రుకుటులై కుటిలాలక జాలమై, సురాం
గనలయి రూపు దిద్దికొనగా ఉలితో అమృతమ్ము చల్లి జీ
వనములు పోసి పోయెదవు; బ్రహ్మవు శిల్పికులావతంసమా!



దాశరథి

1927 సెప్టెంబరులో

నిజాం రాష్ట్రాంధ్ర భూమిలో మానుకోట తాలూ

గూడూరులో జననం

కొద్ది వయస్సులో సనాతన అధునాతన పద్ధతులలో

మంచికవిత చెప్ప గలిగినాడు.

విశాలాంధ్ర ప్రజలను[illegible] గలిగినాడు.

ఇంకను ఉచ్చైస్స్థాన మాక్రమించుగాత